పోలీసు హృదయాలే గద! కాని అందులో వొకడికి ప్రాణం కంటే పొట్టతీపు. వాడు వొణుకుతూ వొణుకుతూ వీలయినంత దూరంగా వుండి, కాగితం కొన పట్టుకొని పైకెత్తాడు.

"అమ్మో!" అని కేకవేసి కళ్ళుమూసుకొని చతికిలబడ్డాడు- కూర్చున్నవాణ్ణి కుక్క-కూడా కరవదు. ఇక బాంబెందుకు పేలుతుంది?

సర్కిల్ కాగితంకింద వున్న పొట్లాంచూచి గజగజలాడాడు. సూటిగా గుండెమీదే పేలిందనుకున్నాడు.

తీరా అందరూ కళ్లుపెట్టుకొని చూచేటప్పటికి అది పంచదార బిళ్లల పొట్లాం అయింది.

సర్కిల్‌కి కోపం వచ్చింది. "ఈ ఇల్లంతా సోదాచెయ్యాలి" అన్నాడు.

"సోదా చేస్తే మీ కవమానం. చెయ్యకపోతే మా కవమానం. అలాగే చెయ్యాలి," అన్నాడు మొదట్నించీ చేతులు పైకెత్తి కూర్చున్న కుర్రవాడు.

సర్కిల్ వెంటనే ఆజ్ఞాపించాడు. ఒక పోలీసు, కుర్రవాళ్లని సోదా చేశాడు:—ఒకరి జేబులో వార్తాపత్రికల కటింగులు దొరికాయి. ఒకరి జేబులో నిప్పుల పుల్లలూ చిల్లా దొరికాయి. మరొకరి జేబులో ధర్మామీటర్ దొరికింది.

ఈలోగా సర్కిల్ వూరుకుంటాడా? గదంతా వెతికి అలమర తెరిచాడు. అందులో మూలగా కనబడీ కనబడకుండా, ఒక సీసా వుంది. దాన్నిండా ఏదో ద్రావకం.

"ఇదేమిటి?" సర్కిల్ జబర్దస్తీగా కుర్రవాళ్లని అడిగాడు. సిగరెట్ తాగే కుర్రవాడు చెప్పాడు—"సీసా"

"లోపల్ది?" — "ద్రావకం"

"ఏం ద్రావకం?" మీదకు మీదకు వెల్తూ రౌద్రంగా అడిగాడు. కుర్రవాళ్ళు బెదిరారు. వొకరిమొహాలు వొకరు చూచుకున్నారు. — "చెప్పండి" గద్దించాడు సర్కిల్.

తలుపు తీసిన కుర్రవాడు చెప్పాడు- "మాకేం తెలుస్తుంది! మేమేం డాక్టర్లమా?"

"అదే తెలుస్తుంది. ఇప్పుడు తెలియదు. రేపు తెలుస్తుంది. కపడ్దార్ ..." అన్నాడు గడ్డాంపోలీసు.

సర్కిల్ సీసాను గుడ్డకు చుట్టి భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. ఇంతలో పోలీసులు రెండు ఎర్ర అట్టల పుస్తకాలు పట్టుకొచ్చారు. అవన్నీ తీసుకొని కోరచూపులు చూస్తూ పోలీసులు నిష్క్రమించారు. ఈమానవులు మళ్ళీ గదిలోనుంచి బయటకు అడుగుపెట్టగానే ఆకారాలుగా తయారయ్యారు.

కుర్రవాళ్ళంతా విరగబడి నవ్వుకున్నారు. చేతులు పైకెత్తుకొని కూర్చున్న కుర్రవాడు (ఇప్పుడు దించేశాడు) తలుపు తీసిన కుర్రవాణ్ణి చూచి, "మళ్ళీ డబ్బొచ్చేదాకా నీకు కాడ్లివర్ ఆయిల్ లేదు," అన్నాడు.

"మళ్ళీ డబ్బొచ్చేదాకా నాకు గుండెజబ్బొ వుండదు —" అన్నాడు ఆ కుర్రవాడు.

అంతా నవ్వుకున్నారు.

వెంటనే గ్లోబ్ చుట్టూ మూగారు. వెంటనే బాహ్యప్రపంచాన్ని మరిచిపోయి తర్కంలో పడ్డారు—రష్యా—మధ్యధరా సముద్రం — ఇటలీ — జర్మనీ — యూరప్‌లో సెకండ్ ఫ్రంట్— ఇండియా— ప్రజాయుద్ధం.

# పిరికివాడు

స్వదేశంమీదకు పరదేశం దండెత్తి నెమ్మదిగా ఆక్రమించు కుంటున్నదని వినగానే, పిరికివాడు రెండు రకాల జండాలు తయారు చేసికొని కూచున్నాడు - ఒకటి స్వదేశంజండా, ఒకటి దండెత్తివచ్చిన పరదేశం జండా.

'స్వదేశం గెలిస్తే ఈ జెండా, పరదేశం గెలిస్తే ఈ జెండా' అని మనస్సులో అనుకొని, గదిలో ఒకమూల పెట్టాడు. ఇక ఏ దేశం గెలిచినా తన కేమీ పరవా లే దనుకున్నాడు. 'స్వదేశం గెలిస్తే స్వదేశం జెండా వుండనే వుంది. పరదేశం గెలిస్తే పరదేశం జెండా వుండనే వుంది. ఇక నా కేం?' అను కున్నాడు. పరదేశ సైన్యాధ్యక్షుడిమీద, 'నీకు దీర్ఘాయురస్తు' అని కొన్ని సీసపద్యాలు రాసి తయారుగా వుంచుకొన్నాడు కూడాను.

అసలు పిరికివాడికి రెండు దేశాలు ఎందుకు యుద్ధంలోకి దిగాలో, ఇంతమంది తమ ప్రాణాలను దేశంకోసం ఎందుకు అర్పించాలో అర్థమయ్యేదికాదు. సంకుచితదృష్టీ, మూర్ఖత్వం ఈ రెండే దీనికి కారణం అనుకునేవాడు. తాను ఈ కక్షలకు అతీతుడననీ, తన హృదయం అతి విశాలమనీ అనుకునేవాడు. కనుక మూర్ఖులు యుద్ధాలుచేసుకొని రక్తపాతం కలిగించుకునే టప్పుడు తనబోటి విశాలహృదయులు ఏం చెయ్యాలి? తమ సుఖంకోసం తాము పాటు పడాలి. ఆలోచించి పిరికివాడు ఈ నిర్ణయానికొచ్చి దానికోసం పాటుపట్టం మొదలుపెట్టాడు.

కాని యుద్ధం తీవ్రరూపం తాల్చిం దగ్గరనుంచీ పిరికివాడు

తను తలపెట్టిన కార్యం అనుకున్నంత తేలిక కాదని గ్రహించాడు. ఏదేశం గెలుస్తుందో ముందే ఎలా తేల్చుకోవటం?

రాత్రంతా ఆలోచించి ఇక స్వదేశం గెలవదు గనుక పరదేశం జెండాపట్టుకొని బయల్దేరదామని నిశ్చయించుకొని తెల్లవారి లేచేటప్పటికి "స్వదేశంసేనలు కొన్ని కొన్ని రంగాల్లో గెలిశాయి," అని పెద్ద పెద్ద అక్షరాల్తో వార్తాపత్రికలు ప్రచురిస్తూ వుండేవి. స్వదేశంజెండా పట్టుకొని బయల్దేరదామనుకొన్నరోజు, "విదేశసేనలు స్వదేశసేనలను తరిమివేశాయి," అని వార్తలు వస్తుండేవి.

పిరికివాడికి ఏమీ తోచక, ఏ జెండా పట్టుకొని వూరేగాలో తేముల్చుకోలేక హైరానయి పోయాడు. రెండుజెండాలకూ ఎదురుగా ఎప్పుడూ ఆగదిలోనే కూర్చునేవాడు. తానురాసిన పద్యాలు మోకాలుమీద కూర్చుని రిహార్సల్సు వేసుకునేవాడు. ఒకక్షణం విదేశం జెండా భుజంమీద పెట్టుకొని గదిలో ఇటూ అటూ పచారు చేసేవాడు—ఒక క్షణం స్వదేశంజండా పట్టుకొని గంతులు వేసేవాడు. రెండూ మూలపెట్టి, ఎదురుగా నిలబడి, "స్వదేశం గెలిస్తే ఈజెండా, విదేశంగెలిస్తే ఈజెండా," అని వెర్రిగా అరిచేవాడు.

ఒకరోజు శత్రువు ఆవూరిమీదకే వస్తున్నాడనీ, ఏభై మైళ్ళ దూరంలో వున్నాడనీ వదంతులు ప్రబలినై. సైన్యంలో జేరగా మిగిలిన ధైర్యవంతులు వూరుఖాళీ చెయ్యటం మొదలు పెట్టారు. పిరికివాడికి ఆవేశం ఎక్కింది. ఇన్నాళ్ళనుంచీ తాను వేసుకున్నప్లాను, ఆచరణలో పెట్టి దాని ఫలితాన్ని అనుభవించే గడియ దగ్గర కొచ్చిందనుకొన్నాడు. కదలకుండా తన

గదిలోనే జెండాలకు ఎదురుగా బాచీపెట్టు వేసుక్కూచుని, "స్వదేశం గెలిస్తే ఈ జెండా, విదేశం గెలిస్తే ఈ జెండా," అనుకొని "ఈజెండే, ఈజెండే, ఇదే జెండా" అనుకుంటూ వెర్రివాడిలా గదంతా చిందులు తొక్కాడు.

ఒకస్నేహితుడు కావలసిన సామానంతా వీపుకు కట్టుకొచ్చి, "రావూ?" అని అడిగాడు.

"నేనా? నేనెందుకురావటం? నేనేం పిరికివాణ్ణా? పిరికి వాళ్ళు పారిపోండి. నేరాను. ఈజెండా, ఈజెండా ఈజెండే," అన్నాడు పిరికివాడు.

బయట ఖాళీచేస్తున్నజనం కోలాహలం పిరికివాడి గదిలో కూడా వినిపిస్తూవుంది. రోడ్లమీద జనం అన్ని దిక్కులకూ తోకలు తెగిన నక్కల్లా పరుగెత్తుతూవుంది. అంతజనంలోనూ బళ్లూ కార్లూ కళ్ళు మూసుకొని తిరుగుతున్నై. మధ్యమధ్య మిలిటరీ కార్లు గంటలు గణగణ మోగించుకుంటూ రంయిున వెల్తున్నై. దూరాన్నుంచి బాంబులు పేలినధ్వనులువినిపిస్తున్నై. జనానికి ఏంచెయ్యాలో తెలియక, ఎక్కడికి పారిపోటానికీ తోచక, రోడ్డుకి అడ్డంగా, బయల్దేరిన చోటునుంచి పరుగెత్తిన చోటుకీ, పరుగెత్తిన చోటునుంచి బయల్దేరిన చోటుకీ పరిగెత్తుతూ కార్లకిందా బళ్ళకిందా పడి నలిగిపోతూ వుంది. మనుష్యుల్లోని ఈచలనమంతా శారీరకమే! బుర్రలు ఆట్టం ఎప్పుడో మానుకున్నై. యుద్ధంరోజుల్లో బళ్ళే మనుష్యులూ— మనుష్యులే బళ్ళూ!

పిరికివాడు గదిలోనుంచి ఇదంతా చూశాడు. పారిపోతున్న జనాన్ని చూచి తనలోతాను నవ్వుకున్నాడు- "పిరికివెధవలు,"

అనుకున్నాడు. హఠాత్తుగా పరదేశం జెండా పట్టుకొని, "ఈ జెండా, ఈ జెండా, ఇదే జెండా," అనుకుంటూ బజార్నపడ్డాడు.

జనం అతన్ని మిలిటరీ లారీని చూచినట్లు చూచి రెండు పాయలై దారిచ్చింది. పిరికివాడు ఆమధ్యనుంచి పరదేశంజెండా బుజానపెట్టుకొని, "ఇదేజండా, ఒకటేజండా, ఒకటేజండా, ఏకైక జెండా," అని కేకలు పెట్టుకుంటూ పరిగెత్తు తున్నాడు.

జనం విరగబడి తొక్కుకుంటూ ఉందేగాని అతన్ని ఏమీ అనలేదు. గుడ్లువప్పజెప్పి చూస్తూ వూరుకుంది. ఏపని చేస్తున్న మనిషి ఆపని ఆపేసి స్థాణువై నిలబడి చూస్తున్నాడు. బళ్ళూ కార్లే ఎక్కడవి అక్కడ ఆగిపోయినై.

"పాపం పిచ్చెత్తింది" అని కొందరు చప్పరించారు. యుద్ధం నుంచి కాళ్లు విరగ్గొట్టుకొనీ, చేతులు విరగ్గొట్టుకొనీ, మూతులు పగలగొట్టుకొనీ, మెదళ్లు చిట్లగొట్టుకొనీ పిచ్చెక్కి వికృతాకారాలతో రోడ్లమీద తిరిగే మనుష్యుల్ని ఈమధ్య ఆ వూరి ప్రజలు చాలామందిని చూచివున్నారు. అందుకనే తేలిగ్గా 'పిచ్చెక్కింది' అనే నిర్ణయం... ...

పిరికివాడు ఆవిధంగా పరిగెత్తి పరిగెత్తి వూరిబయట్టకు పరుగెత్తాడు. అక్కడ ఒక్క క్షణంనిలబడి బాంబులు పేలుతున్న వైపుకి చూశాడు. దూరంగా చెట్లచాటునుంచీ, గుట్టల చాటునుంచీ తుపాకీలతో బిలబిలా పరుగెత్తుకు వస్తున్న సైన్యాన్ని చూశాడు.

చెయ్యి వొణికింది. భుజంమీద వున్న విదేశజండా రెపరెప కొట్టుకుంది. హృదయం ఆవేశంతో తుకతుకలాడింది. తనశక్తి నంతా కేంద్రీకరించుకొని "జై జై! ఈ జెండాకే జై! ఇదే

జెండాకీ జై!" అని కేకలు పెట్టుకుంటూ వచ్చే సైన్యానికి ఎదురుగా మళ్లీ పరుగు లంకించుకున్నాడు. ఒక్కొక్క అడుగు దగ్గరకు వెల్తున్నకొద్దీ గాలే మారిపోతున్నది. ముక్కు రంధ్రాల్ని బద్దలుకొట్టే కంపు. ఢాం, ఢీం, ఢూం, అని శూన్యాన్ని కూడా బద్దలుకొట్టే మోతలు. కళ్ళు తెరవటమే కష్టమయింది. అలాగే పిరికివాడు శరీరాన్ని బిగబట్టి పరిగెత్తాడు. భుజంమీద వున్న జెండా గాలికి గిల గిల కొట్టుకుంటూవుంది. హఠాత్తుగా పిరికివాడు భూమిలో గుచ్చుకుపోయినట్లు ఆగిపోయాడు.

అంతా నిశ్శబ్దం. బాంబులమోతలు ఒక్కసారి ఆగిపోయినై. పిరికివాడు నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు. శవాలు. ఎటు చూచినా శవాలే! తనచుట్టూ శవాలే!! కొంచెం దూరంలో సైన్యం.

ఆ సైన్యం ఇదివరలోలాగా లేదు. అంతాకలిసి ఉప్పొంగిన హృదయంలాగా, పొంగిన సముద్రంలాగా వొస్తూవుంది. ఆ సైన్యానికి ముందు నడుస్తున్న వ్యక్తిని చూశాడు పిరికివాడు. అతని చేతిలోనూ జెండావుంది. అదీ రెపరెప గిలగిలలాడుతూవుంది. "జై, జై. ఈ జెండాకీ జై. ఇదే జెండాకీ జై. పరదేశ జెండాకీ జై," అని అరిచాడు పిరికివాడు. కాని ఇదేమిటి? అదేం జెండా!

దిమ్మతిరిగి కళ్ళు బయర్లుకమ్మి పిరికివాడి చూపు సరిగ్గా ఆనటం లేదు. సైన్యం అలికిన గోడలా కనిపించింది. వాళ్ళచేతుల్లోని తుపాకులు నెమలి పింఛాల్లా విప్పుకుంటున్నట్లు కనిపించాయి. జెండాపట్టుకున్నవ్యక్తి తోలుబొమ్మలా రెల్లుదుబ్బులా కనిపించాడు. అతనిచేతుల్లోని జెండా స్వదేశం జెండా!

కాని పిరికివాడు నమ్మలేకపోయాడు. కళ్లుతుడుచుకొని చూట్టానికి తన చేతులో జెండా వుండె. మళ్ళీ సైన్యాన్ని చూశాడు. స్వదేశ సైనికుల్లా కనిపించారు.

ఏమిటిది? అతని గుండెలు పగిలినై. అది స్వదేశం జెండాయే! అది స్వదేశం సైన్యమే!! తాను పొరపాటుపడ్డాడు. ఈ సంగతి ఆకళింపుకిరాగానే తన గదిలోవున్న స్వదేశంజెండా జ్ఞప్తికి వచ్చింది. కెవ్వున కేకవేసి గిరుక్కునతిరిగి తన ఇంటికి, స్వదేశం జెండాకోసం పరుగు లంకించుకున్నాడు.

ఢాం...ఢాం.

పరుగెత్తే పిరికివాడి గుండెల్లోకి ఒకేసారి రెండు గుళ్ళు జొరబడ్డాయి. ఒకటి సైన్యంలోనుంచీ, ఒకటి చెట్టుచాటునుంచీ వచ్చినై. ఒకటి వీపులోనుంచీ, ఒకటి రొమ్ములోనుంచీ గుండెల్లోదూరి కలుసుకున్నై. ఆ విశాల హృదయంలో స్వదేశ విదేశ నాగరికతల సమ్మేళన ఈవిధంగా జరిగింది.

"అమ్మో!" అనే భయంకర ఆర్తనాదమే ఈ సమ్మేళన ఫలితం.

పిరికివాడు ఆ రెండు గుండుదెబ్బల్తో కిందపడి, లుంగలుపడి, చాపలా చుట్టుకుపోయి, తల రొమ్ములోకి దూర్చుకొని, ప్రాణాలువొదిలాడు. ప్రాణాలు పోయేముందు ఒక్కసారిమాత్రం పెదవులు కదలినై — "స్వదేశం గెలిస్తే ఈజెండా, పరదేశం గెలిస్తే ఈజెండా!"

# ధర్మవడ్డీ

నేనా వూరు ఎందుకు వెళ్ళానో, నాకిప్పుడు జ్ఞాపకం లేదు. కాని వెళ్ళటం, చిన్నప్పటి స్నేహితుడు కనపట్టం, తన ఇంటికి నన్ను తీసుకు వెళ్ళటం జరిగింది. కలవక కలవక కలుసుకోవటం వల్ల, చిన్నప్పటి విషయాలు తలుచుకొని నవ్వుకుంటూవున్న సమయంలో అతడొచ్చాడు. రావటం రావటం ఎలా వచ్చాడని ?

ముందు వాకిలి నెమ్మదిగా తెరిచాడు. కుడికాలు గడపలో పెట్టి అటూ ఇటూ దొంగచూపులు చూశాడు. చంకలో వున్న మూటని పదిలంగా రెండో చేత్తో పట్టుకొని, తల ఓరగా పెట్టి అడుగులో అడుగు వేసుకుంటూ, నా స్నేహితుని దగ్గరకువొచ్చి, చంకలో మూట అందిస్తూ, "ఇదిగోనోయ్, డబ్బు" అన్నాడు.

అసలు అతన్ని చూడగానే నా స్నేహితుని కళవళికలు మారిపోయినై. అంతకు ముందున్న సంతోషం మాయమై పోయింది. నెమ్మదిగా మూట అందుకుంటూ "మనిషంటే మనిషివి నువ్వే సూరయ్యా? నికాల్సఖన మనిషివి" అన్నాడు.

ఈ మాటకు సూరయ్య సంతోషం పైకి కనపడనివ్వకుండా, "మాటల కేంలే! డబ్బు తీసుకోగానే కాదు. నెలరోజుల్లో అసలు ఫాయిదాలు ఇచ్చి వెయ్యాలి. వడ్డీ నీకు తెలిసిందేగా- ధర్మవడ్డీ— నెలకు నూటికి రూపాయిన్నర. అదైనా నువ్వాని ఇస్తున్నాను," అన్నాడు.

"అలాగే సూరయ్యా, నెలదాటకముందే ఇస్తాను," అన్నాడు నా స్నేహితుడు.

"ఇస్తానంటే కాదు. మాట చెల్లించుకోవాలి. శుభకార్యం ఒకటి తలపెట్టానా? మంచికీ చెడ్డకీ డబ్బు కావాల్సి వొస్తుంటుంది. తర్వాత కోర్టు గీర్టూ అంటే......"

"అ దేమిటి సూరయ్యా! నీ దగ్గర ఎన్ని సార్లు డబ్బు తీసుకోలేదు. ఎన్నిసార్లు ఇవ్వలేదు. ఎప్పుడైనా మాట తప్పేలు వొచ్చిందా?"

"సరేలే. డబ్బు లెక్కపెట్టుకో. అన్నీ రూపాయలే! కొద్దిగా మాత్రం చిల్లర వుంది. మళ్ళీ నాకు రూపాయలే ఇవ్వాలి సుమా! నోట్లూ గీట్లూ అంటే కుదరదు."

"నువ్వు చెప్పాలా, సూరయ్యా" అంటూ నా స్నేహితుడు మూట విప్పాడు. చూసే టప్పటికి నా తల తిరిగిపోయింది. అయోమయం అయిపోయింది. ఆ మూటలో వున్న వన్నీ రాళ్ళే! చిన్న చిన్న రాళ్ళూ, పెద్ద పెద్ద రాళ్ళూ— పెద్ద వన్నీ కంకర రాళ్ళూ, చిన్న వన్నీ గులకరాళ్ళూ! నమ్మలేక నా స్నేహితుని మొహం పరీక్షగా చూశాను. అతడు మాత్రం ఇదంతా లెక్క చెయ్యకుండా, అతి జాగ్రత్తగా ఆ రాళ్ళని తీసి ఒక్కొక్కటే లెక్కపెడుతూ కూర్చున్నాడు.

నా కేమీ తోచక సూరయ్యవంక చూశాను. అత నింకా తల ఓరగా నేపెట్టి లెక్కపెట్టబడుతూవున్న రాళ్ళను రెప్పవెయ్యకుండా పరీక్షిస్తున్నాడు. ఇంతలో నా స్నేహితుడు లెక్క పూర్తిచేసి, "సరిపోయినయ్యి, సూరయ్యా" అన్నాడు.

"ఇవ్వాళ సరిపోయినై అంటే కాదోయి. ఇవ్వాళ ఇరవై. మళ్ళీ ఇరవై సోమవారం నాటికి నా డబ్బంతా దమ్మిడీల్తో ఇచ్చెయ్యాలి," అని జ్ఞాపకంచేసి నా స్నేహితుడితో మూడుసార్లు

'ఇస్తాను' అనిపించుకొని వెళ్లిపోయాడు సూరయ్య.

అతడు ఎప్పుడు వెళ్తాడా, ఈ తంతేమిటో ఎప్పుడు తెలుసుకుందామా అని కూర్చున్న నేను, అడుగుదామని నా స్నేహితుని వైపుకి తిరిగేటప్పటికి, అతడు చేత్తో నన్ను వారించి వాకిలి వైపుకి చూపాడు. నేను అటు చూట్టం, సూరయ్య గభాలున తలుపు నెట్టుకొని లోపలకు రావటం ఒకేసారి జరిగింది. మనిషి ఇదివరకుమల్లే లేడు. ఆపాదమస్తకం వొణికిపోతున్నాడు. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. గాలి తెగ పీలుస్తున్నాడు. తల మాత్రం ఓరగానే వుంది.

ఒకక్షణం వాకిట్లో ఆగి రెంయిన నాస్నేహితుడి మీదకు వచ్చి ఇలా కేకలు వేశాడు—"ఏదీ నా డబ్బు? ఎన్నాళ్ళయింది? ఇదిగో అదిగో అంటూ కుక్కని తిప్పుకున్నట్టు నీ యింటిచుట్టూ తిప్పుకుంటావా? పరువూ మర్యాదా ఉండక్కర్లా? కడుపుకి అన్నంతింటున్నావా, గడ్డితింటున్నావా?"

నిజంచెప్పొద్దూ ఈమాటలు వినేటప్పటికి నాకు కంపరం ఎత్తింది; కోపం వచ్చింది. కాని ఏమిచెయ్యటం? గుడ్లు వప్పచెప్పి చూస్తూ కూర్చున్నాను.

నా స్నేహితుడు భయంగా, అతి వినయంగా, "ఇదిగో సూరయ్యా, నీ డబ్బు! నాలుగు రోజులు ఆలస్యమైనంత మాత్రాన నీ బోటి పెద్దమనిషి ఇట్లా నోరు పారేసుకోవటం ఏం మర్యాద?" అని తన దగ్గరేవున్న ఆ రాళ్ళమూటని ఇచ్చాడు.

"మరి వడ్డీయో? డబ్బు నాకు చేదైై ఇచ్చాననుకున్నావా? నీ తాతకి అచ్చుండి ఇచ్చాననుకున్నావా? పూర్తి పరిష్కారం

చేసి కదులు," అని బొడ్లో చెయ్యేసి నిలవేశాడు సూరయ్య.

"ఇస్తాను సూరయ్యా, మరి వొదులు," అన్నాడు నా స్నేహితుడు.

"తీసుకురా" అని ఒక్క తోపు తోశాడు సూరయ్య.

నా స్నేహితుడు పడబోయి నిభాయించుకొని గోడపక్కకు వెళ్ళి, పదిరాళ్ళు ఏరితెచ్చి సూరయ్య చేతులో పెట్టాడు. సూరయ్య వాటిని లెక్కపెట్టుకొని, నా స్నేహితునితో ఒక్క మాటైనా అనకుండా గిరుక్కున వాకిలివైపుకు తిరిగి తల ఓరగానే వుంచుకొని గబగబా నడిచి వెళ్ళిపోయాడు.

నా స్నేహితుడు ఒక్క నిట్టూర్పువిడిచి నేను అడగవలసిన అవసరం లేకుండా తానే ఇలా చెప్పాడు—"పాపం ఏం చెప్పను? ఒకప్పుడు ఈ వూళ్లోకల్లా షావుకారు ఈ సూరయ్య. ఇప్పుడు పిచ్చెక్కి ఈవిధంగా తయారయ్యాడు," అన్నాడు.

"ఇతనికిపిచ్చా! ఎందుకెత్తింది? పిచ్చిలో ఇదేమిటి?" అని అడిగాను.

నా స్నేహితుడు సూరయ్య కథ ఈ విధంగా చెప్పాడు.

"సూరయ్య ఈగతికి రావటానికి అతని తండ్రే కారణం. అతని తండ్రి చాలా మంచివాడు. మెత్తని హృదయం కలవాడు. అటువంటి ఆతడే, కొడుకు పతనానికి కారకుడయ్యాడు."

"అంత మంచివాడు......"

"చెప్తాను విను. అంత మంచివాడు అవటంవల్లే దానాలు చేసీ, అడ్డాలు వుండీ తన ఆస్తంతా పాడుచేశాడు. ఆస్తిపోయిం తర్వాత పలకరించే దిక్కులేకుండా చచ్చిపోయాడు. ఇది కన్నులారా చూచిన సూరయ్యకు సంఘంమీాద కసి ఏర్పట్టంలో

ఆశ్చర్యం లేదు. అందుకని పూర్తిగా తన స్వభావాన్నే మార్చుకొని, పెత్తనానికి వొచ్చి నప్పటినుంచీ కఠోరంగా సంపాదించటం మొదలు పెట్టాడు. వున్న నాలుగు ఎకరాలూ అమ్మేసి వడ్డీవ్యాపారం మొదలు పెట్టాడు. మనుష్యుల్తో వున్న ఇతరత్రా సంబంధాలన్నీ క్రూరంగా తెగ్గొట్టుకున్నాడు. తనకీ మిగిలిన మనుష్యులకీ ఒక్కటే సంబంధం—వడ్డీవ్యాపారం. తాను వడ్డీకి డబ్బు ఇవ్వటానికి పుట్టాడు. మిగిలిన జనం డబ్బు పుచ్చుకొని వడ్డీ ఇచ్చుకోటానికి పుట్టింది.

ఇట్లా తయారై, మిగిలిన రైతుల్ని పీల్చి పిప్పిచేసి కొద్ది సంవత్సరాల్లోనే వూళ్లోకల్లా షాహుకారై కూర్చున్నాడు. కాని ఎంత షాహుకారైనా డబ్బు సంపాదించటం అలవాటైంతర్వాత పద్ధతులు ఎలా మారతై—కనక డబ్బు అవసరం లేనప్పటికీ కూడా పాతపద్ధతులమీదే నడిచాడు. పిల్లికి బిచ్చం పెట్టేవాడు కాదు. అడిలి గీపెట్టినా దమ్మిడీ జారనిచ్చేవాడు కాదు. బాకీ దార్లని ఎన్ని కష్టాలు పెట్టాలో అన్నీపెట్టి ఇన్ని నీళ్లుకూడా పుట్టకుండా చేసి తన డబ్బు పిండుకునేవాడు. ఆ పిండు కోవటంలో కూడా దయా దాక్షిణ్యాల్లేవు. కొంపలు కూలినా, కుటుంబాలు నాశనమైనా అతని హృదయం కరిగేది కాదు.

అందుకని అతని డబ్బుతోపాటు, అతని మీద వూళ్ళో అసూయా అసహ్యంకూడా పెరుగుతూ వచ్చినై. అతన్ని చూస్తే భయమే తప్ప ఇష్టం ఒక్క వ్యక్తికూడా లేకుండాపోయింది. సూరయ్య ఇది కూడా మంచిదే అనుకున్నాడు. నా కొకావల సింది డబ్బు-వీళ్ళ ఇష్టం ఎవరికొకావాలి ? అంటూవుండే వాడు. పరిస్థితులు ఇట్లా వుండగా ఒక సంఘటన జరిగింది.

ఈ వూళ్ళోనే అవతలి వీధిలో చంద్రయ్యా అనే రైతు వున్నాడు. చంద్రయ్యా ఈ సూరయ్యకి రెండు వందల రూపాయల బాకీ ఇవ్వ తేలాడు. చంద్రయ్యా అవటం చిన్నరైతే ఐనా ఊళ్ళో సంబంధం వున్న వాడవటంవల్ల, డబ్బన్నా కోర్టన్నా లెక్క లేకుండా వుండేవాడు. డబ్బున్న వాళ్ళంటే అసహ్యం వుండి భయం లేదు. తనకు అవసరానికి డబ్బిచ్చాడనే విశ్వాసం లేకపోగా తన దగ్గర సూరయ్యా అన్యాయంగా డబ్బు దోచుకుంటున్నాడనే భావం, కోపం కలిగినవాడు. సూరయ్యా హెచ్చు వడ్డీ వస్తుందని అతనికి అప్పు పెట్టాడే గాని, పెట్టిం దగ్గర్నించీ డబ్బు రాదేమో అనే భయంతో అతని ఇంటి చుట్టూ తిరగటం మొదలు పెట్టాడు. ఒకరోజు చంద్రయ్యాని నా డబ్బిచ్చి కదలమని నిలవేశాడు. నానా దుర్భాషలూ ఆడాడు. దాన్తో లోలోపల రగులుకుంటున్న అగ్ని చంద్రయ్యాలో నుంచి గుప్పున బయటపడింది— "నేను దమ్మిడీ ఇవ్వను. నీ తాత్తో చెప్పుకో! ముందు గడపలో నుంచి అవతలకు వెళ్ళు," అని కేకలు వేశాడు.

పాపం సూరయ్యాకు ఇట్లాంటి అనుభవం ఇదివర కెప్పుడూ కలగ లేదేమో, చంద్రయ్యా మాటలకు నిరుత్తరుడై ఒక్క నిమిషం మాట్లాడ లేకపోయాడు.

"వెళ్ళవ్!" అని గద్దించాడు చంద్రయ్యా. "చంద్రయ్యా! ఇది నీకు మంచిది కాదు. కోర్టుకులాగి పప్పు తీయిస్తాను," అన్నాడు సూరయ్యా.

"పప్పు తీయిస్తావట్రా మాదచ్చోద్" అని నానా బూతులూ కూసి మెడమీద కర్ర వేసి బయటకు గెంటాడు చంద్రయ్యా.

ఇక చూడు సూరయ్యా సంగతి. సూరయ్యాకు శివం ఎత్తింది.

పిచ్చి గంగిర్లై తిర్గినై. కనపడ్డవాడికల్లా చెప్పాడు. "ధర్మవడ్డీ - ధర్మవడ్డీకూడా ఇవ్వడట! అసలే ఇవ్వడట! ఇదెక్కడన్నా వుందా? రాములవారి కాలం నుంచీ ఈ వడ్డీ వుందిగదా!" అని మొత్తుకున్నాడు.

తిరిగి తిరిగి ఇంటికి వెళ్ళి గబగబా నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని, అంగోస్త్రం నడుంకి కట్టి, తెల్లగుడ్డ గొడుగు చంకన పెట్టి టౌన్‌కి బయల్దేరాడు. అప్పటికీ ఆశ చావక, చంద్రయ్య వాకిలి ముందు సకిలిస్తూ నాలుగైదుసార్లు అటూ ఇటూ పచారు చేసాడు. బజార్న పోతున్నవారిని నిర్నిమిత్తంగా పిలిచి, "కొంచెం కోర్టులో పనివుండి టౌన్‌కి వెల్తున్నాను," అని ఇంట్లో వున్న చంద్రయ్యకు వినబడేటట్టు చెప్పాడు. చంద్రయ్య, "కోర్టు కాదు. నిన్ను పుట్టించిన బ్రహ్మదేముడి దగ్గరకు వెళ్లు. ఈ వూరు నీళ్లు నీకు ప్రాప్తం లేదు," అని ఇంట్లో నుంచే కేక వేశాడు.

ఇకేం చేస్తాడు? ఇక తప్పేదేముంది? చంద్రయ్య మాటలకు మనస్సులో కొంచం జంకినా డబ్బెలా వొదులుకోవటం? మనస్సుని తిట్టి లోబరచుకొని టౌన్‌కి వెళ్ళి ప్లీడరుతో మాట్లాడి చంద్రయ్యకు రిజిష్టరీ నోటీసు ఇప్పించాడు. నోటీసైతే ఇప్పించాడేగాని మనస్సులో ఆరాటం హెచ్చింది. దిగులు దిగులుగా వుండి ఏమీ తోచక టౌన్లో అటూ ఇటూ తారట్లాడి ఇంటికి బయల్దేరేటప్పటికి మసకపడ్డది. టౌన్ నుంచి మా వూర్రావాలంటే రోడ్డు దిగి డొంకలో మైలు నడవాలని నీకు తెలుసు. సూరయ్య డొంక దగ్గరకు వచ్చేటప్పటికి బాగా చీకటి పడ్డది. రోడ్డు దిగేటప్పటికి అతనికి భయం వేసింది. ఆ డొంక మా

ఒకట్లే వూరికి వచ్చేదే అవటంవల్ల మనుష్యసంచారం తక్కు వగా వుంటుంది. పైగా రెండు పక్కలా కొరివిదయ్యాలు తలలు విరబోసుకున్నట్లు కనబడే, గుబురుగా పెరిగిన చెట్లూ. సూరయ్య ధైర్యంచేసి ఆంజనేయ దండకం పఠిస్తూ డొంకలో పది గజాలు నడిచాడు. ఆ పెద్దమర్రిచెట్టు చూశావుగా, అక్కడకు వొచ్చాడు. అకస్మాత్తుగా పక్కపొదల్లో అలికిడి వినిపించి ఆగిపోయాడు. గొంతులో పాట గొంతులోనే ఆగిపోయింది. వెంటనే అతని కోసం పొదల్లో కనిపెట్టుకూచున్న చంద్రయ్య ముఠా పదిమంది అతన్ని కమ్ముకున్నారు- మీదకు దూకారు. చావచితగ గొట్టారు. పాపం కింద పడేసి సున్నం మీద యముక ల్లేకుండా కొట్టారు. చంద్రయ్య మీదపడి అతని జేబులో వున్న ఇరవై రూపా యలూ లాక్కొని, "దావా దాఖల్చేశావుగా! కర్చెవ్వడు పెట్టుకుంటాడు నీ తాత?" అని కాలికి వొచ్చినట్టు తన్ని, మిగి లిన వాళ్లని తీసుకొని, సూరయ్యని అక్కడే వొదిలి వెళ్ళి పోయాడు.

క్షణాలమీద ఈ వార్త వూరంతా పాకింది. "సూర య్యని కొట్టారంటే సూరయ్యని కొట్టా"రని వూరంతా ఆ గుబ్బుగా చెప్పుకుంది. కాని ఒక్కడుకూడా జాలి తలిచినవాడే లేడు. 'పాపం' అన్న పాపాన పోయినవాడే లేడు.

సూరయ్య భార్యా, కూతురూ మాత్రం భోరున ఏడ్చారు. సూరయ్య భార్య దొడ్డ ఇల్లాలు. కూతురుకూడా చాలా మంచిది. కాని బయట జరిగే దురంతాలను వాళ్లెలా ఆప గలరు? సూరయ్య మనస్సుని ఎలా తిప్పగలరు?

తెల్లకి తెల్లవారింతర్వాత వూళ్ళో షావుకార్లు సూరయ్యని

పరామర్శించటానికి వొచ్చారు. సూరయ్యకు ఆ రాత్రంతా నిద్ర లేదు. ఏదో ఆలోచించుకుంటూ కూర్చున్నాడు. భార్యా కూతురూ నోటికి మాట లేకుండా ఏడుస్తున్నా, వాళ్ల వంక కే చూట్టం లేదు. అన్ని దెబ్బలు తిన్నా ఒక్క మూలుగన్నా మూలగటం లేదు.

షావుకార్లు వొచ్చి, "సూరయ్యా! ఇక చూస్తూ వూరు కుంటే లాభం లేదు. క్రిమినల్ కేసు బనాయించి వాళ్ళఅంతు కనుక్కోవలసిందే !" అన్నారు.

సూరయ్య ఏమీ మాట్లాడలేదు. ఏదో ఆలోచించుకుంటూ పడుకున్నాడు. అతని మౌనాన్ని షావుకార్లు అపార్థం చేసు కొని, "కాదు సూరయ్యా, మనం తప్పక గెలుస్తాం. అనుమానం లేదు..." అన్నారు.

సూరయ్య కొంచెం కదిలి, వాళ్లని నింపాదిగాచూచి, "ఇంకేం ? అందరం చందాలు వేసుకొని వ్యాజ్యమాడదాం," అన్నాడు.

'చందాలు' అనేటప్పటికి షావుకార్లు మొహా మొహాలు చూసుకున్నారు. "అదేమిటి సూరయ్యా, నిన్ను కొట్టట మేమిటి? మేం చందాలు వేసుకోవట మేమిటి?" అన్నారు.

ఈ మాటలకు సూరయ్యకు కోపం వొచ్చింది. అంత బాధలోనూ లేచి కూర్చొని, "వాళ్ళు నన్ను కొట్టారా? నా దగ్గర వున్న డబ్బుని కొట్టారు. అంటే ఈ వూళ్ళోవున్న షావు కార్లందర్నీ కొట్టారు. వడ్డీకోసం అప్పుపెట్టే ప్రతివాడ్నీ కొట్టారు. నన్ను కొట్టటమైతే ఒక్క చంద్రయ్యే కొట్టేవాడు. మిగిలిన వాళ్లంతా ఎందుకు కుమ్మక్కు చేస్తారు? వాళ్ళు

కొట్టగలరు గనక అంతాకలిసి కొట్టారు. మనం చందాలు వేసు కోగలం గనక అంతా కలిసి చందాలు వేసుకుందాం," అన్నాడు.

షావుకార్లకు ఇదేమీ అర్థం కాలేదు. దెబ్బల్తో సూరయ్య మతి చెడ్డది అనుకున్నారు. నెమ్మదిగా ఒకరి తర్వాత ఒకరు జారుకున్నారు.

ఎంతమంది చెప్పినా, ఎంత చెప్పినా సూరయ్య వినలేదు— కేసు పెట్టనంటే పెట్టనన్నాడు. "నా సొంతడబ్బు తగలేసుకొని, ఈ డబ్బున్న వాళ్లకోసం వ్యాజ్యం ఆడిపెట్టనా? నే చెయ్యను," అనేవాడు.

కాని చంద్రయ్య ఏ ముహుర్తాన చెయ్యి చేసుకున్నాడో గాని, అప్పటినుంచీ సూరయ్య దశ తిరిగి పోయింది. దెబ్బలుతిని కేసు పెట్టకపోయేటప్పటికి వూళ్ళోవాళ్ళకి లోల్లి అయిపోయాను. తాము ఏడబ్బుని చూచి భయపడుతున్నారో, ఆడబ్బు సమ యానికి సూరయ్యని అదుకోలేకపోయేటప్పటికి ఇంకేముంది ? పెద్దలు మొదలు కుర్రవాళ్ళవరకూ సూరయ్యని ఆటలు పట్టిం చటం మొదలు పెట్టారు. ఇల్లు కదిల్తే చాలు — "సూరయ్య వడ్డీ చంద్రయ్య లాఠీ" అని పిల్లలు చప్పట్లు కొట్టుకుంటూ వెంటపడేవారు. రావలసిన డబ్బు అడిగితే బాకీదార్లు "ఏం, తన్నులు కావాలా ?" అనేవారు. కొందరు 'ఇదిగో అసలు, ఇదిగో వడ్డీ' అని మొట్టికాయలు వేసేవారు కూడాను.

చివరకు సూరయ్యకు చిల్లిగవ్వ కూడా వసూలు కాకుండా పోయింది. ఎట్లా వచ్చిన డబ్బు అట్లాగే పోయింది. ఎక్కడ పెట్టిన డబ్బు అక్కడే యింకిపోయింది. తనకు తదనంతరమైనా వస్తుం దనుకున్న ఆస్తి రాకుండా పోయిందని అల్లుడు కూతుర్ని ఇంట్లో

నుంచి వెళ్ళగొట్టాడు.

సూరయ్య భార్యా మొహం, కూతురు మొహం చూడలేక పీకలైనంతవరకు ఇంట్లో వుండకుండా తిరుగుతూ కాలం గడిపే వాడు. నాలుగు మెతుకులు నోట్లో వేసుకొచ్చి చెరువుగట్టు మీద రావిచెట్టుకింద ఒంటరిగా కూర్చునేవాడు. ఇన్ని రాళ్లు ఏరుకొని ఒక్కొక్కటీ చెర్లో వేస్తూ, అవి నీళ్లల్లో పుట్టించే కద లికను పరీక్షిస్తూ, కూర్చునేవాడు.

కాని వూళ్ళో జనం అక్కడా అతన్ని సుఖంగా వుండనివ్వ లేదు. అతడు నిస్సహాయుడౌతున్నకొద్దీ జనం తన బలాన్ని ఎక్కు వగా ఉపయోగించటం మొదలుపెట్టింది. జనానికి అతని మీద కలగిన కసీ, అలుసూ అతన్తోనే ఆక్క అతని కుటుంబం మీదకు తిరిగింది.

ఒకరోజు సూరయ్య కూతురు వాముల దొడ్లో గేదెకు మేత వేస్తుంటే నలుగురు పట్టుకొని గాతంలో పడేసి బలాత్కారంగా చెరిచారు. వాళ్లు విడిచిపెట్టి వెళ్ళింతర్వాత ఆపిల్ల లేచి, నడవలేక. కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి, బావిలో పడి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంగతి తెలిసి సూరయ్యభార్య, అవమానాలు సహించలేక కిరసనాయిలు పోసుకొని కాల్చుకొని మరణించింది. అదే సమ యంలో విరోధులు సూరయ్య ఇవ్వవలసిన బాకీలు తమ పేర ట్రాన్స్ఫర్ చేయించుకొని ఇల్లు వేలం వేయించారు..."

ఇంతవరకు ఓపికతో విని, ఇక ఆపుకోలేక నేను ఈ ప్రశ్న వేశాను—" ఈ ఘోర కృత్యాల్ని జరక్కుండా ఎవ్వరూ ఆపలేదూ ?"

" తప్పన్నవాళ్ళే లేరు. చేసుకున్నది అనుభవిస్తున్నాడని

కొందరూ, ఈ ఉద్రేకంలో అడ్డు చెపితే తమ కుటుంబాలు సరిగ్గా ఉండవేమో అనే భయంతో కొందరూ — మొత్తానికి అంతా మెదలకుండా వూరుకున్నారు."

"ఊఁ! తరవాత ఏం జరిగింది ?" అని అడిగాను.

"ఇకే ముంది? డబ్బుదారిన డబ్బు నడిచింది కూతురు అలా అయిపోయింది. భార్య ఇలా అయిపోయింది. సూరయ్య గుండెలు పగిలిపోయినై. ఆవులాగా అడలుతూ, వూరుపట్టుక తిరిగేవాడు. కొన్నాళ్ళకు పిచ్చెత్తింది. ఇప్పు డెవరన్నా జాలి తలిచి ఇన్ని మెతుకులు పెడితే తింటాడు. ఆ చెఱువు గట్టుమీది రావిచెట్టు కిందే వుంటాడు. ఎండలో వానలో అక్కడే వుంటాడు. ఎప్పుడూ కూతురు సంగతిగానీ, భార్యా సంగతిగానీ ఎత్తడు. ఎవర్నీ పలకరించడు. రోజు కొక్కసారి వెళ్ళి తన పాతఇంటిని దూరా న్నుంచి చూచుకొని కన్నీరు పెట్టుకుంటూ వుంటాడనీ, రాత్రిళ్ళు తన కూతురు పడి ఆత్మహత్య చేసుకున్న బావి దగ్గరకువెళ్ళి ప్రదక్షిణంచేసి వస్తూవుంటాడనీ వూళ్లో చెప్పుకుంటూ వుంటారు... ఇదీ సమాచారం..."

నేను కథంతా ప్రాణాలు బిగబట్టుకొని విన్నాను. సూరయ్య కథ చెప్పమన్నప్పుడు ఇటువంటి విషాదగాథ వింటానికి సిద్ధపడ లేదు గనక చాలా ఖేదపడ్డాను. "మరి ఈ రాళ్ల వ్యవహార మేమిటి ?" అని అడిగాను.

"అలవాటు" అన్నాడు నా స్నేహితుడు. "పాత అలవా టుని పట్టి ఇలా చేస్తూవుంటాడు. మేం కూడా జాలిపడి అతని మనస్సుని ఈ అవస్థలో కష్టపెట్టటం ఎందుకని తగువిధంగా ప్రవ రిస్తూ వుంటాం. ఈ సూరయ్య..."

నా స్నేహితుడు చెబుతూవుండగానే వీధిలో పెద్దగోల బయ ల్దేరింది — "సూరయ్యా వడ్డీ, చంద్రయ్యా లాఠీ," అని కేకలు. బయట నుంచే సూరయ్య 'బే' అని అడిలాడు. ఆ ధ్వని విని మే మిద్దరం బయటకు పరిగెత్తాం.

బయట వీధిలో సూరయ్య రోజుకుంటూ, రొప్పుకుంటూ గబగబా నడుస్తూ వెల్తున్నాడు. చేతులో నా స్నేహితు డిచ్చిన మూట భద్రంగా వుంది. వెనక పదిమంది పిల్లలు పోగై గోల చేసుకుంటూసూరయ్య మీదకు రాళ్ళు విసురుతున్నారు.

నడుస్తూ నడుస్తూ వున్న సూరయ్య అకస్మాత్తుగా పరిగెత్తటం మొదలు పెట్టాడు. రంయిన పరిగెత్తి ఒక ఇంటిముందు ఆగి, ఒక్క నిమిషం ఆయింటిని చూచి, అక్కడనుంచి కదిలి పక్కనే వున్న బావిగట్టుమీద నిలబడ్డాడు. పిల్లలంతా ఎక్కడి వాళ్లు అక్కడే ఆగిపోయారు. చేతుల్లో రాళ్లు చేతుల్లోనే వున్నాయి. నేనూ నా స్నేహితుడూ వూపిరి బిగబట్టిచూస్తూ నుంచున్నాం. సూరయ్య వంగి బావిలోకి చూచి లేచి, ఇంటివైపుకి చూశాడు. ఉండి ఉండి 'బే' అని సైరికలాగా, విన్న వాళ్లకి సలపరం పుట్టేటట్టు అడిలి రాళ్లమూటతో సహా బావిలోకి దూకాడు.

వాళ్ళూ వీళ్ళూ పోగయ్యారు గాని ఏమీ లాభం లేక పోయింది. నా స్నేహితు డిచ్చిన రాళ్లమూట తేలనివ్వక పోయింది. శవం బయటికి వచ్చింది. తర్వాత - మేం ఇంటికి వచ్చిం తర్వాత - నా స్నేహితుడు ఇలా చెప్పాడు—"ఆ ఎదు రుగా వున్న ఇల్లే అతని ఇల్లు. అతడు దూకినబావే అతని కూతురు ఆత్మహత్య చేసుకున్న బావి."

# భయం

గోపీ అప్పుడే రైలుదిగాడు. అతని తల్లి చనిపోయి ఎక్కువ రోజులు కాలేదు. చనిపోయేముందు "తమ్ముళ్లున్నారు బాబూ!" "చెల్లెలికి ఎటువంటి సంబంధం తెస్తావో?" అని తల్లి చెప్పిన మాటలు ఇంకా చెవుల్లో గింగురు మంటూనే వున్నై.

అమ్మ పోయిన్నాటి రాత్రి, అంతా గొల్లున ఏడుస్తుంటే, "ఏందు కన్నయ్యా!" అని అడిగాడు పెద్దతమ్ముడు.

"వాళ్లకు పిచ్చెత్తింది, వాళ్ళెప్పుడూ అంతే," అని చెప్పాడు గోపి.

గోపీ పెద్దతమ్ముడు చిన్నతమ్ముణ్ని అడిగాడు-"అమ్మేదిరా?"

వాడు ఆకాశం వైపు చూపించాడు. అందులో గోపీకి వేదాంతం కనిపించింది. అమ్మ చచ్చిపోలేదు. చచ్చిపోయింది మనం. ఈలోకమంతా చచ్చిపోయింది. ఈ చచ్చిన లోకంలోనుంచి అమ్మ బతికింది.

కాని ఆ రాత్రి మాత్రం గోపీకి ప్రపంచం ఎడారిగా, శూన్యంగా, వల్లకాడుగా, భయంకరంగా కనిపించింది.

ఇవన్నీ జ్ఞాపకంవచ్చి, ఎరిగినవాళ్ళుగానీ, స్నేహితులుగానీ కనిపించి "మీ అమ్మకు ఎట్లా వుంది?" అని అడుగుతారేమోనని భయంవేసింది గోపీకి.

"కూలీ?" అని పిలిచాడు.

"బాబూ"

"పెట్టె తీసుకురా"

"ఎక్కడకు బాబూ?"

పేట పేరు చెప్పాడు గోపి.

"అణా బాబూ"

"బేడ ఇస్తా, నాతో రా."

పెట్టె కూలివాడి నెత్తిమీదపెట్టి పరధ్యానంగా బయల్దేరాడు గోపి. కూలీ గోపీ వెనక అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెల్తున్నాడు.

వర్షంకురవటానికి ప్రయత్నిస్తూవుంది. సూర్యుడు నాశనమైన చీకట్లో నక్షత్రాలు మెరుస్తున్నయి. గోపీ కూలీ పిల్లవాడితో సంభాషణ మొదలుపెట్టాడు:—

"రోజుకి ఎంతొస్తుందిరా?"

"అర్ధణో, అణో వొస్తుంతండీ!"

"దాన్తో ఏం చేస్తావ్?"

"కొనుక్కు తింటాను."

"ఇంటిదగ్గర ఇవ్వవూ?"

"నాకు అమ్మాబాబూ లేరండీ! ఉంటే అట్లాగే ఇచ్చేవాణ్ణి."

"మరి నీకు పొట్ట ఎలాగురా గడవటం?"

"ఇక్కడ ఒక పోర్టరుకాడ వుంటున్నానండీ. ఆయన ఇంట్లో పనిచేసి పెడతాను. అన్నం పెడతారు. రైలొచ్చినప్పుడు ఇట్లా కూలి మోస్తుంటాను. ఏ అణో వొస్తే కొనుక్కు తింటాను. రాత్రిపూట రైలుస్టేషన్లోనే పడుకుంటానండీ..."

"ఎంత హాయి బ్రతుకురా," అనుకున్నాడు గోపి. కాని అప్పట్నుంచీ ఆపిల్లవాణ్ణి చూస్తే గోపీకి భయం.

# ఇలా జరిగేను!

అది రెండో సంవత్సరం—

గత సంవత్సరమంతా యశోధరుడు ఆ పల్లెలోనే వుండి పార్టీపనిచేశాడు. రాత్రింబగళ్ళు నిద్రా నీళ్లూ లేకుండా పని చేశాడు. వ్యవసాయకూలీలను గురించి బండెడు పుస్తకాలు చదివాడు. వాళ్లల్లో చైతన్య రహితంగా పడివున్న శక్తిని గ్రహించాడు. వాళ్ళ హక్కులను తెలుసుకున్నాడు. రైతులు వాళ్ళనేవిధంగా పీడిస్తూ వుందీ—అతని భాషలో రక్తం తాగటం—అర్థం చేసుకున్నాడు. ఇవన్నీ వాళ్లకి చెప్పాడు.

"పని చేసేది మీరు: ఫలితం అనుభవించేది వారు" అన్నాడు.

ఎవరా అని వ్యవసాయకూలీలు అటూ ఇటూ చూశారు.

"రోజుకి గుప్పెడు మెతుకు లేకుండా మీరెంతకాలం ఇలా బ్రతుకుతారు?" అని ప్రశ్నించాడు. వ్యవసాయకూలీలు తమ తమ కుండలు సర్దుకున్నారు. ఆరబోసిన బెత్తల్నీ, కుప్పలు కుప్పలుగా వున్న పీతల్నీ, వేలాడకట్టివున్న చీకుల్నీ చూచుకొని గుటకలు మింగారు.

"మీ శక్తి మీకు తెలియదు. మీరు ఏకంగా ఒక్కపెట్టున లేస్తే రాజ్యాలే మీ చేతుల్లోకి వస్తయ్," అన్నాడు యశోధరుడు.

వాళ్ళు ఒకళ్ళ చేతులు ఒకళ్ళు చూచుకున్నారు. ఎవరి చేతులు వాళ్లు దులుపుకున్నారు.

ఈవిధంగా అతడు సంవత్సరం తంటాలుపడ్డాడు. సంవత్సరం తిరిగివచ్చేటప్పటికి అతని కృషికి ఫలితాలు గోచరించినయ్. వ్యవసాయ కూలీల్లో విప్లవచిహ్నాలు కేకెత్తినయ్. ఎక్కడ

చూచినా 'కూలీ లందరు ఏకము కావలెరా' అనే కీర్తనే విన బడుతూ వుంది—ప్రతిదానికీ యశోధరుని సలహా తీసుకోవటం మొదలుపెట్టారు. క్షణక్షణానికీ పల్లె అంతా మారిపోతున్నట్లు ఊహించుకున్నాడు. తన కృషి నేటికి ఫలించిందికదా అని సం తోషించాడు యశోధరుడు. ఈ వేడిలోనే జయం పొందాలను కున్నాడు. వ్యవసాయకూలీలు 'సై' అన్నారు.

"పదండి పోదాం, పదండి ముందుకు," అన్నాడు వెంకాయ. పల్లె పల్లె బిలబిలా బయల్దేరింది. పిల్లలు పెద్దలు అంతా బయ ల్దేరారు. షాహుకారు బసవయ్య ఇల్లు చుట్టుముట్టారు.

షాహుకారు బసవయ్య వెంకాయిదొర. ఆవూళ్ళో రైతు లందర్లోకీ డబ్బున్నవాడు. ఆ ఇంటిదగ్గరకు జేరినప్పటినుంచీ, మిగిలినవాళ్ళు కేకలు వేస్తున్నా వెంకాయి కొంచం బెరుగ్గా వుంటం మొదలుపెట్టాడు.

"తలుపు తలుపు" అని కేకవేసింది జనం.

కాని తలుపు అలాగే మూసుకొని వుంది. వ్యవసాయ కూలీ లకు ఏం చెయ్యటానికీ తోచలేదు. అయిదు నిమిషాలయింది— పది నిమిషాలయింది—పావుగంట అయింది. తలుపు అలాగే వుంది. వ్యవసాయకూలీలు ముగ్గురు నలుగురు చొప్పున ఒకొ్కకొ్కచోట జేరి కబుర్లు చెప్పుకోవటం మొదలు పెట్టారు. యశోధరుడికి చిరాకువేసింది. ఉపన్యాసం మొదలుపెట్టాడు.

"కామ్రేడ్స్"—

ఇంతలో తలుపు తెరుచుకుంది. బసవయ్య బయటకు వచ్చాడు. అతని వేలు పట్టుకొని మూడేళ్ళ కూతురొచ్చింది. భార్య అన్నపూర్ణ తలుపు పక్కనుంచి తొంగి చూస్తూ వుంది.

ఉపన్యాసకుణ్ణి వొదిలి వ్యవసాయ కూలీలంతా వొక్క సారి బసవయ్యవైపుకి తిరిగారు. కూర్చున్నవాళ్ళంతా వొక్క సారి లేచి నిలబడ్డారు. తరువాత ఏం చెయ్యాలో తోచలేదు. అలాగే చూస్తూ నుంచున్నారు.

బసవయ్య మూడేళ్ళకూతురు గుంపులోవున్న వెంకాయిని గుర్తుపట్టింది. సంతోషంగా "అలుగో, ఎంకు, ఎంకు, ఎంకు," అని బుల్లిచేతుల్తో చప్పట్లు కొడుతూ గంతులేసింది.

వెంకాయి సిగ్గుతో తలవంచుకొని, "మా చిన్నదొరసాని, మా చిన్నదొరసాని" అని పక్కనున్న వాళ్లకి చెప్పాడు.

"వెంకా?" అని పిలిచాడు బసవయ్య,

వెంకాయి వులిక్కిపడ్డాడు. "ఎళ్ళరా, పెద్దదొర పిలుస్తున్నాడు," అని అంతా వెంకాయిని ముందుకు నెట్టారు.

"ఏరా ఎంకా బాగున్నావా?" అన్నాడు బసవయ్య. ఆ మాటలు వెంకాయి హృదయాన్ని కరిగించినయ్. ఎన్నడో విడిచిన తండ్రిని చూచినట్లు ఆనందించాడు. ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నిలబడ్డాడు.

"ఎందుకురా, ఇంతమందొచ్చారు? ఏమన్నా పనుందా?" అని అడిగాడు బసవయ్య.

"ఏం లేద్దొరా," అని సణిగాడు వెంకాయ.

"చెప్పు. దొరతో చెప్పుకోరా! మనవిచేసుకోరా," అని కొంతమంది కేకలు వేశారు.

వెంకాయి, తప్పక ధైర్యం చేశాడు—"ఏంలేద్దొరా! మా కొకటి కావాలి."

"ఏమిటి చెప్పు?"

"నూతనం వెవస్త"

"ఏమిటీ?"

"నూతన వెవస్త దొ్రా"

బసవయ్య కొంచంసేపు ఆలోచించాడు. కాని అర్థం కా లేదు—"అది నాదగ్గర లేదు," అన్నాడు.

"చూడు దొ్రా" అని ప్రాధేయపట్టానికి రెండడుగులు ముందుకు వేశాడు వెంకాయి.

"నా దగ్గర లేదురా, పోయి మన జమీందారు దగ్గరుం దేమో అడుగు," అన్నాడు బసవయ్య.

"అవును. ఆయనద్దగ్గరే దొ్రుకుద్ది. అక్కడే దొ్రుకుద్ది," అని మిగిలినవాళ్ళు కేకలు వేశారు. యశోధరుడు ఉక్కిరి బిక్కిరై పోయాడు. ఏం చెయ్యాలో బోధపడలేదు. ఎలా జోక్యం కలి గించుకోవాలో తెలియలేదు. జోక్యం కలిగించుకుంటే ముం దీ వ్యవసాయకూలీలు వూరుకుంటారా? అనే స్థితి కొచ్చింది.

వెంకాయ మళ్ళీ బసవయ్య నడిగాడు—"ఇంకొకటి దొ్రా!"

"ఏమిటి?"

"కూలీలంతా ఏకం కావాలి దొ్రా."

"ఎందుకు?"

"కావాలి దొ్రా!"

"ఎందుకురా, కారణం చెప్పు"

"కారణం ఏంటి దొ్రా! ఏకం కావాలి".

"సరే అవ్వండి."

"అదేంటి దొ్రా, అలా సెలవిత్తావ్?. దొ్రసాయం లేకుండా మేం ఎట్లా ఏకం అవుతాం?."

"సరే అట్లాగే అవ్వుదురుగాని. మరి మమ్మేల్నేం చెయ్యమంటావు?" అన్నాడు బసవయ్య.

"మీరా...దొరలా...దొరలా......" అంటూ నసికాడు వెంకాయి.

"నిజమేరా, దొరల్నిడిచి మనం ఎక్కడికి పోతాం—" అన్నారు కొందరు.

"నువ్వడిగింది బాగుంది దొరా!" అన్నాడు వెంకాయి.

"అందుకని మనం అంతా ఏక మవుదాం," అన్నా డొక వ్యవసాయ కూలీ.

"ఏక మవుదాం, ఏకమవుదాం" అని మిగిలిన కూలీల్లోనుంచి కేకలు. వెంకాయి సంతోషం చెప్పటానికి వీల్లేదు. అమాంతంగా బసవయ్య మూడేళ్ల కూతుర్ని ఎత్తుకొని—

"మా చిన్ని దొరసాని
మా చిట్టి దొరసాని
మా బుల్లి దొరసాని
ఏకమవుదాం
ఏకమవుదాం
ఏకమవుదాం—" అని గంతు లేశాడు.

"అంతా జమీందారు మీదకు పోదాం. నూతన వెవస్త తెచ్చుకుందాం. దొరలుంటే మనకేం భయం," అని వ్యవసాయ కూలీలంతా కేకలు.

"ఇక మీ పనుల్లోకి మీరు పొండి," అన్నాడు బసవయ్య. వెంకాయితప్ప అంతా సంతోషంగా గుసగుసలాడుకుంటూ వెళ్ళారు.

"దొరంటే పెద్దదొరని చెప్పుకోవాల్రా," అన్నా డొకడు.

"కష్ట సుఖాలు తెలిసిన మారాజు," అన్నాడు ఇంకొకడు.

"అడిగినయ్యన్నీ వొప్పుకున్నాడ్రా," అన్నాడు మరొకడు.

అన్నపూర్ణమ్మ అప్పుడు బయటకువచ్చి, "వెంకా! వెళ్ళే ముందు గేదెముందు ఇంత గడ్డివేసి పో! మజ్జిగ వున్నయ్, పోయించుకుపో," అంది.

"అట్లాగే దొరసానమ్మా" అని దొడ్లోకి పరుగెత్తాడు వెంకాయి.

వెంకాయిని చూచి గేదె 'బే' అని అడిలింది.

యశోధరుడు ఒకక్షణం తన్ను తాను నమ్మలేకుండా అలాగే నిలబడిపోయాడు. శూన్యం—శూన్యం—శూన్యం—జేబులోనుంచి అచ్చుపుస్తకం తీశాడు. గబగబా పేజీలు తిరగ వేశాడు. అప్రయత్నంగా ఈ వాక్యం అతని కంట బడింది. "ప్రజాస్వామిక విప్లవంలో వ్యవసాయకూలీలూ రైతులూ కలిసి పోట్లాడాలి."

"ఇది ప్రజాస్వామిక విప్లవమా?" అనుకున్నాడు. అటూ ఇటూ చూశాడు. కాని అప్పటికే ఎవ్వరిదారిన వాళ్ళు వెళ్ళారు. వ్యవసాయకూలీలు ఎవ్వరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళారు. బసవయ్య భార్యనీ కూతుర్నీ తీసుకొని ఇంట్లోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

యశోధరుడికి మిగిలింది శూన్యమే!



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B138 |
| పుస్తకం పేరు | దేశం ఏమయ్యేట్టు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | VedaVathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |